# కార్వేటినగర
# రాజవంశ చరిత్ర

రచన
అరికట్ల సుబ్రహ్మణ్యం




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2015

**KARVETINAGARA RAJAVAMSA CHARITHRA**

*By*

**Arikatla Subrahmanyam**

T.T.D. Religious Publication Series No : 1137


*First Edition : 2015*

*Copies :*

*price :*

*Published by :*
**Dr. D. SAMBASIVA RAO**, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*D.T.P :*
Office of the Editor- in- Chief,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందుమాట

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు, కలియుగ ప్రత్యక్షదైవము అయిన శ్రీ వేంకటేశ్వరస్వామివారిని ఎందరెందరో రాజులు దర్శించారు. మరెందరో రాజులు శ్రీవారికి కైంకర్యాలను అందించారు. అటువంటి వారిలో ప్రథములు విజయనగర రాజులు. విజయనగర ప్రభువులు శ్రీవారికి చేసిన సేవలకు నిదర్శనంగా నేటికీ తిరుమల శ్రీవారి ఆలయంలో ఉభయదేవేరులతో కూడిన శ్రీకృష్ణదేవరాయల కాంస్య విగ్రహాలు నెలకొల్పబడ్డాయి.

తిరుమల శ్రీవారిని కేవలం విజయనగర ప్రభువులేకాక వారి సామంత రాజులు మరియు మిత్రరాజులు కూడా సేవించి తరించారు. అటువంటివారిలో ప్రసిద్ధులు కార్వేటినగర రాజులు. కార్వేటినగర రాజులు చోళరాజుల పరంపరలో వచ్చినవారు. శ్రీహరి స్వప్నసాక్షాత్కరం మేరకు పద్మావతీదేవి జనకుడైన ఆకాశరాజుకు నారాయణపురంతో కూడిన అర్ధరాజ్యాన్ని ధారాదత్తం చేసినవారు ఈ రాజులే.

కార్వేటినగరంలో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయంతో పాటుగా శివాలయాన్ని కూడా నిర్మించి హరిహరాభేదాన్ని చాటారు ఈ రాజవంశీకులు. ప్రస్తుతం కార్వేటినగరం శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం తి.తి.దేవస్థానముల ఆదీనంలో ఉంది.

స్వామివారికి అనేక కైంకర్యాలను నిర్వహించిన కార్వేటినగర రాజుల చరిత్ర కాలగర్భంలో కలిసిపోతూంటే చూసి భరించలేక ప్రముఖ చిత్రకారులు శ్రీ అరికట్ల సుబ్రహ్మణ్యంగారు నగర రాజుల చరిత్రను గ్రంథస్థం చేసి

తి.తి.దేవస్థానములకు అందించారు. వారికి ధన్యవాదాలను తెలుపుకుంటూ ఈ గ్రంథాన్ని పాఠకలోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాము.

సదా శ్రీవారి సేవలో

కార్యనిర్వహణాధికారి.

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి.

# పీఠిక

చరిత్ర రాయాలంటే కచ్చితమైన విషయాలు తెలియాలి. ఆ విషయాలు ఆ రాజరికానికి సంబంధించినవై వుండాలి.

ఒక కథ, లేదా నవల రాయడం సులభమే, కాని చరిత్ర రాయాలంటే కొంత శ్రమపడాలి. అందులోను కార్వాటినగర రాజుల చరిత్రను గ్రంథస్తం చేయడమంటే ఒక సాహసమే అవుతుంది.

కార్వేటినగర రాచరికానికి సంబంధించిన ఆధారాలన్ని దాదాపు శిథిలమైపోయాయి. దానిని ఎవరూ మిగుల్చుకోలేకపోయారు. కొన్ని అన్యాక్రాంతమైపోయాయి.

కార్వేటినగరచరిత్ర వ్రాయాలనేది అనేక సంవత్సరాల ఆలోచన. కాలం కలసి రాలేదు. ఒకప్పుడు రాజనగరి ప్రాంతాలన్నీ బాగా కలియతిరిగాను. ప్రతి దేవాలయాన్ని తరిచి తరిచి చూశాను. అందులోని శిలాశాసనాలు సేకరించాను. భారత పురాతత్వ శాఖ (మైసూరు) వారిని సంప్రదించి ఎన్నో ఆధారాలు సేకరించాను. అవన్నీ గతము.

ఇందులో నేను వ్రాసిన ప్రతి అక్షరం ప్రామాణికమైనదే. దీనికి శాసనాలు కావచ్చు, లేదా ప్రాచీన గ్రంథాలు కావచ్చు ఏదో ఒకటి ఆధారంగా ఉన్నవే. కాకమ్మ కథలకు ప్రాధాన్యం ఇవ్వలేదు. కనీసం వాటి ప్రస్తావన కూడ చేయలేదు.

మహాభారతం, రామాయణం మన చారిత్రక గ్రంథాలు. వాటిలో మన పూర్వీకుల గురించి, ప్రాంతాల గురించి చాలా విషయాలు ఉన్నాయి. కానీ

బ్రిటీషు వారు వాటిని కథలన్నారు. కల్పితాలన్నారు. మనలో చాలామంది అదే నమ్మారు.

కాని కొందరు బ్రిటీషువారు మన చరిత్రను కొంత వరకు ప్రపంచానికి చాటారు. దానిపై పరిశోధనలు చేశారు. మన భాష నేర్చుకొన్నారు. మన శాసనాలను శోధించారు. వెలుగులోనికి తెచ్చారు.

కాని మనం మాత్రం అందులో కొంతైనా చేయడం లేదు. మన చరిత్రపట్ల మన పూర్వీకులపట్ల మనకు ఆదరణ లేదు. అవగాహన లేదు. మన పూర్వీకుల పట్ల మనం ఆసక్తిని చూపాలి. గౌరవాన్ని చూపాలి. మన దేవాలయాలు, మన శాస్త్రాలు మన ప్రగతికి మార్గాన్ని చూపిస్తాయి.

అద్భుతమైన నిర్మాణకౌశలం, శిల్ప కౌశలం మన దేశంలో అనాదిగా ఉంది. మన పూర్వీకులు గణిత, ఖగోళ శాస్త్రాలను శిల్ప శాస్త్రంతో మేళవించి దేవాలయ నిర్మాణం చేశారు. ఎంతోమంది శత్రుదేశాలరాజులు ఈ దేశ సంస్కృతిని దెబ్బతియ్యడంలో భాగంగా మనప్రాచీన మందిరాలపై ఎన్ని దాడులు చేసినా కొంతవరకు పాక్షికంగా దెబ్బతిన్నా ఇంకా అలాగే చారిత్రక సాక్షాలుగా నిలిచి ఉన్నాయి.

దక్షిణ భారత శిల్ప కళకు 'చోళరాజులు' విశేష కృషి చేశారు. ఆ చోళరాజులతో మన కార్వేటినగర చరిత్ర ముడిపడి వున్నది. ముందుగా కార్వేటినగర శ్రీవేణుగోపాల స్వామి వారిని స్మరిస్తూ రాజుల చరిత్రలోకి వెళదాం.

రచయిత

**అరికట్ల సుబ్రహ్మణ్యం**

# అంకితము

కార్వేటినగర శ్రీవేణుగోపాలస్వామి వారిని ఎంత చూచినా చూడాలనిపిస్తుంది, ఆ స్వామి మనోహరరూపము చూస్తుంటే మనస్సు పరవశించిపోతుంది.

శ్రీస్వామివారు మహిమాన్వితమైన దేవుడు మనం స్వామివారికి కొంత సమర్పిస్తే అంతకు రెండింతలతో స్వామివారు మనల్ని కరుణిస్తారు.

శ్రీవేణుగోపాలస్వామివారికి, శ్రీరామచంద్రులవారికి ఈ చిన్ని పుస్తకం అంకితం.

ఎన్నో సంవత్సరాల కోరిక తీర్చిన తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి వారులకు శిరస్సు వంచి నమస్కరిస్తూ శ్రీవారి దివ్యచరణాల వద్ద ఈ గ్రంథాన్ని సమర్పించుకొంటున్నాను.

కృష్ణం వందే జగద్గురుమ్

రచయిత

**అరికట్ల సుబ్రహ్మణ్యం**

కార్వేటినగరం

# శ్రీ వేణుగోపాల స్వామి సుప్రభాతమ్

దేవకీ సుప్రజా దేవ పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్,

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళమ్ కురు.

తవ సుప్రభాత మరుణాబ్జ లోచనే!
తరుణేందు బింబ వదనేఽఘమోచని!
శరణాగతార్తి హరణైక దీక్షితే!
కరుణారసౌఘవరుణాలయే! రమే!

దేవా శ్చతుర్ముఖ పురందర శంకరాద్యాః
సిద్ధా స్సనాతన సనందన నారదాద్యాః,
త్వా మర్చితుం వివిధ పుష్పకరాశ్చరంతి
శ్రీవేణువాదనపటో! తవ సుప్రభాతమ్.

గోపీగృహాంత రుపకల్పిత మంథనోత్థ
హైయ్యంగవీనహృతికల్పితవృత్తజాతమ్,
అద్యాపి తథ్య మిహ కర్తు మివాసి తాదృ
గ్రూపో యదూత్తమ! విభో! తవ సుప్రభాతమ్.

కస్తూరికా కలికయా కలితాలకస్య
కందర్పకోటి సదృశస్య కృపాంబురాశేః,

కళ్యాణభూమిధరకాంక్షిత ధైర్యభాజః
శ్రీవేణుగోప భవతాత్తవ సుప్రభాతమ్.

శ్రీకారువేటిపుర భూసుర దేశికేంద్రైః
శ్రీగోపవాట మిదమిత్యుదితప్రబోధైః,
శ్రీరుక్మిణీ సరస సత్యసమాశ్రితాంఘ్రే
శ్రీవేణుగోప! భవతాత్తవ సుప్రభాతమ్.

లక్ష్మీశ కేశవహరే నృహరే మురారే
శౌరే రమారమణ కేశవ దీనబంధో,
ఇత్యాదరేణ వదతా మిహ భద్రదాయిన్
శ్రీవేణుగోప! భవతాత్తవ సుప్రభాతమ్.

శ్రీసుప్రభాతవినుతిం సుకృతాభిధేయాం
ప్రాత స్సమాహితమతి ర్య ఇమాం పఠేయుః
తేభ్యో భుజంగదమనో భువి వేణుగోప
స్సర్వాణి వాంఛితఫలాని సదా ప్రసూతే.

**శ్రీ వేణుగోపాలస్తుతిః**

నవజలధరవర్ణం చంపకోద్భాసికర్ణం
వికసితనళినాస్యం విస్ఫురన్మంద హాస్యమ్
కనకరుచిదుకూలం చారుబర్హావచూడం
కమపి నిఖిలసారం నౌమి గోపీకుమారమ్.

ముఖజిత శరదిందుః కేళిలావణ్యసింధుః
కరవినిహిత కందుః వల్లవీ ప్రాణబంధుః,



వపురుపసృత రేణుః కక్షనిక్షిప్త వేణుః
వచనవశగ ధేనుః పాతు మాం నందసూనుః.

పూర్ణవర్తులశర్వరీపతి గర్వరీతిహరాననం
నందనందన మిందిరాకృతవందనం ధృతచందనమ్,
సుందరీరతిమందిరీకృతకందరం ధృతమందరం
కుండలద్యుతిమండలప్లుత కంధరం భజ సుందరమ్.

గోకులాంగణమంగళం కృతపూతనాభవమోచనం
కుందసుందరదంత మంబుజబృందవందిత లోచనమ్,
సౌరభాకర ఫుల్లపుష్కర విస్ఫురత్కరపల్లవం
దైవత వ్రజదుర్లభం భజ వల్లవీకుల వల్లభమ్.

రమితనిఖిలబింబే వేణుపీతోష్ఠబింబే
హతఖలనికురుంబే వల్లవీదత్త చుంబే,
భవతు మహితనందే తత్ర వః కేళికందే
జగదవిరళతుందే భక్తి రుర్వీముకుందే.

**శ్రీ వేణుగోపాల ప్రపత్తిః**

శ్రీ రుక్మిణీధవ దయాపర దివ్యమూర్తే
దేవాధిదేవ జగదేకశరణ్య విష్ణో,
గోపాంగనాకుచతటీ వినిమగ్న దృష్టే
తే వేణుగోప చరణౌ శరణం ప్రపద్యే.

దేవాధిదేవ ఫణిరాజ విహంగరాజ
రాజత్కిరీట మణిరాజి విరాజితాంఘ్రే,

రాజధిరాజ యదురాజకులాధిరాజ
తే వేణుగోపచరణౌ శరణం ప్రపద్యే.

దేవప్రసిద్ధ కరుణాకర భక్తవర్గ
సేనాపతి ప్రణమితాఖిల లోకబంధో,
శ్రీ కారువేటి నగరాధిప రాజరాజ
తే వేణుగోపచరణౌ శరణం ప్రపద్యే

అక్రూర హృత్కమల సంభవ భక్తి బద్ధ
వాఙ్మాలయార్చిత మహోజ్జ్వల రమ్యపాద,
గోపాధినాథ వసుదేవకుమార విష్ణో
తే వేణుగోపచరణౌ శరణం ప్రపద్యే.

శ్రీనారదాది ముని ముఖ్యగణై స్సహస్రైః
సంస్తూయమాన చరణాంబుజ! సర్వశేషిన్,
గోపాలవంశ తిలకార్చితపాదపద్మ
తే వేణుగోపచరణౌ శరణం ప్రపద్యే.

### శ్రీ వేణుగోపాల మంగళాశాసనమ్

మంగళం వేణుగోపాయ మహతాం దివ్య చక్షుషే,
మాదృశాన్రక్షితుం మహ్యామావిర్భూతాయ మంగళమ్
స్వకీయ రూపలావణ్య గాంభీర్య గుణసిన్ధవే,
సర్వలోక శరణ్యాయ శుద్ధ సత్వాయ మంగళమ్.

పంచాననాది దేవానాం పరమార్థ ప్రదాయినే,
పంకజాసన సంసేవ్య పాదపద్మాయ మంగళమ్.



మల్లికాపుష్ప తులసీ మాలాలంకృత వక్షసే,
మశకీకృత దైత్యాయ మహాధీరాయ మంగళమ్.

అనంతకోటి బ్రహ్మాండ ధారిణేఽనంత మూర్తయే,
పార్థాయ గీతా పీయూష దాయినే తేఽస్తు మంగళమ్.

శంఖచక్రలసద్ధస్త మురళీహస్తశోభినే,
శశిమార్తాండనేత్రాయ శాంతరూపాయ మంగళమ్.

శ్రీకారువేటినగరే శ్రితభక్తావనాయ వై,
శ్రియా సహావతీర్ణాయ శ్రీకృష్ణాయాస్తు మంగళమ్.

గోపాలచరణద్వంద్వ సపర్యానిరతాత్మనా,
గ్రథితం వరదార్యేణ సుప్రభాత మిదం హరేః.





శ్రీకృష్ణుడు - అష్ట దేవేరులు

# కార్వేటి నగర రాజవంశ చరిత్ర

**ప్రస్తావన :-**

కార్వేటినగరం చిత్తూరు జిల్లాలో చిత్తూరు - పుత్తూరు జాతీయ రహదారిపై, పుత్తూరు నుండి 12 కిలోమీటర్ల దూరంలో ఉంది.

చుట్టూ కొండలు మధ్యలో లోయ ఆ లోయలో కార్వేటినగరం నిర్మితమైంది. చుట్టు ఉన్న కొండలు శత్రువులనుంచి సహజసిద్ధంగా రక్షణ కల్పిస్తున్నాయి.

తమిళ భాషా పరంగ, [1]'కాదు-వెట్టి-నగరం' అనగా అడవిని కొట్టి నగర నిర్మాణం చేశారని అర్థం సంస్కృత భాషా పరంగ కారు-వేటి-నగరం అనగా అడవిచేత చుట్టబడిన నగరం అని అర్థం.

ఎటువంటి పరిస్థితులలోను నీటికరవు రాకుండా నగరం చుట్టు అనేక జలాశయాలు నిర్మించారు.

'చోళులు' తమరాజ్యన్ని నాడులుగా, కొట్టాలుగా విభజించుకొన్నారు (అంటే నేటి జిల్లాలు, మండలాల వలె)

కార్వేటినగరం అప్పట్లో 'కుస్ర వట్టన కొట్టం' లోని 'వట్టియురునాడు' లోనిది. వట్టియురునాడు పాలకులనే "నగర రాజులని" వ్యవహరించేవారు! 'తిరుమల' తిరుక్కడవూరు నాడు లోనిది.

---

1. నిశ్శంక దుర్గ శిలా శాసనము - భారతి మార్చి 1971

**ఆకాశరాజు :-**

శ్రీవేంకటేశ్వర స్వామి వారికి ఆకాశరాజు తమ కుమార్తె పద్మావతిని ఇచ్చి నారాయణపురంలో వివాహం జరిపించాడు.

కరికాల చోళమహారాజుకు నాల్గవ తరంవాడు నారాయణరాజు (నగర రాజు). ఈ నారాయణ రాజుకు శ్రీవేంకటేశ్వరస్వామివారు కలలో కనిపించి తనకు కాబోయే మామగారికి అర్ధ రాజ్యం ఇమ్మని ఆదేశించాడు. నగర రాజులు శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తులు.

ఆ ఆదేశాన్ని శిరసావహించి తిరుత్తణి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వారి దేవాలయంలో దాన కార్యక్రమాన్ని నిర్వహించి తన రాజధాని నారాయణపురంతోసహా అర్ధరాజ్యం ఇచ్చేశాడు[2].

ఈ నారాయణ రాజే తిరుత్తణి శ్రీవిజయరాఘవస్వామి దేవాలయాన్ని నిర్మించాడు. కాలనిర్ణయం లేదు.[3]

(Mr. Sewells తన List of Antiquities Vol No. I Page No: 158 నందు ఈ విషయాన్ని ప్రస్తావించాడని ప్రతీతి.)

**బ్రహ్మరాజు - శ్రీపద్మావతి పరిణయ చంపూ :-**

క్రీ.శ. 1780 - 1840 ప్రాంతంలో కార్వేటినగర సంస్థానంను బ్రహ్మరాజు పాలించాడు. ఈతని కాలంలో 'శ్రీశైల కవి' పద్మావతి పరిణయం అనే చంపూ కావ్యంను రచించి అందులో కార్వేటినగర రాజుల వంశవృక్షం

---

2. నిశ్శంకదుర్గ శిలా శాసనము - భారతి 1971

(అనుబంధ ప్రకరణములో దుర్గశాసన పాఠాన్ని చూడవచ్చు)

3. Indian Epy No. 447 Dt 1906



సంక్షిప్తంగా ఇచ్చాడు. నగర పాలకులు 'చోళులని' వీరివంశ మూలపురుషుడు 'కరికాలచోళ మహారాజని, రచించాడు. నిశ్శంకదుర్గ శాసన పాఠం పద్మావతీ పరిణయ చంపూ కావ్యంలోని విషయం ఒకటేగా ఉన్నాయి. ఈ పుస్తకం సంస్థాన ముద్రణాలయంలో ముద్రితమైంది.

ఆకాశరాజు వంశంలోనివారు నాలుగు తరాలలో అంతరించి శ్రీ వెంకటేశ్వరస్వామిలో ఐక్యమైపోగా, నగర రాజులు తిరిగి నారాయణ వనం వెళ్ళకుండా కార్వేటి నగరంలోనే వుండిపోయారు.

**తిరుమలరాజు - శత్రుఘ్న విజయ ప్రబంధం :-**

బ్రహ్మరాజు కుమారుడైన తిరుమలరాజుకు గరుడాద్రి సుబ్రహ్మణ్య కవి క్రీ.శ 1864లో శత్రుఘ్న విజయ ప్రబంధంను అంకితం ఇచ్చాడు. ఇందులో కవి కార్వేటినగర రాజవంశ చరిత్ర కొంతఇచ్చాడు. ఐదు తరాల వారిని పేర్కొని వారికి ముందు మకరాజుని పేర్కొన్నాడు. ఈ పుస్తకం దుర్గశాసనం తో ఏకీభవిస్తున్నది.

**విప్రనారాయణ చరిత్రం :-**

దీని కృతికర్త 15 వ శతాబ్దానికి చెందిన చదులవాడ మల్లన. ఆ గ్రంథం 'తిరుమలరాజు'కు అంకితం చేయబడినది.

ఆంధ్ర కవితరంగిణి ప్రకాశకులు జయంతిరామయ్య పంతులు, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారలు ఈ తిరుమలరాజు వంశములోనివారే అయితే కార్వేటినగర పాలకులని పొరబడ్డారు. తిరుమలరాజు వంశవృక్షం పుస్తకంలో కొంత పొందుపరిచారు.

రాజు చనిపోతే అతని అల్లుడు మాకరాజు రాజుస్థానంలో వుండి రాజ్య వ్యవహారాలు చూచేవాడు. రాజుస్థానంలో పాలన చేస్తున్న మాకరాజుపై

గౌరవంతో అతని కుమారుడైన తిరుమల రాజుకు ఈ గ్రంథం అంకితంగా ఇవ్వబడింది.

తిరుమలరాజు తండ్రి మాకరాజు వేయించినదే 'నిశ్శంకదుర్గ' శిలాశాసనం. నగరరాజుల చరిత్రలో నిశ్శంకదుర్గ శిలాశాసనం చాలా ప్రధానమైనది. నగర రాజులు (ముగ్గురు, నలుగురు) తప్పితే మిగిలినవారు పెద్దగా శాసనాలు వేయలేదు. ఒకరిద్దరు వారి భార్యల పేరుతో శాసనాలు వేయించారు.

కార్వేటి నగర సంస్థానంలో చేతితో వ్రాసిన 'రాజ వంశావళి' వుండేది. (నేను దానిని 1970 ప్రాంతంలో చూచి నిశ్శంకదుర్గ శాసనంతో సరిపోల్చుకొన్నాను. రెండూ సరిపోయాయి.) నేడు చేతితోవ్రాసిన ఆ వంశావళి లేదు. అన్యాక్రాంతమైపోయింది.

బ్రహ్మరాజు కాలంలో రాసిన పద్మావతీ పరిణయ చంపూ గ్రథంలో పేర్కొన్న చరిత్ర రచనాకాలం నాటికి, విప్రనారాయణ చరిత్ర రచనా కాలంనాటికి కార్వేటినగర సంస్థానమును పరిపాలించిన రాజవంశం మారివుండాలి. కానీ ఆ విధంగ నగర పాలన చేసిన రాజవంశం మారినట్లు ఆధారాలు కన్పించుటలేదు. 'నిశ్శంకదుర్గ' శిలాశాసనం ఇందుకు ప్రభలాధారం.

**నారాయణ వనం :-**

దీని ప్రాచీన నామం నారాయణపురం. నారాయణ రాజుపేరుతో వేల ఏండ్ల క్రితం నిర్మితమైన నగరం. వీధులన్ని ఒక దానికొకటి సమాంతరంగా వుండి అన్ని వీధులు దేవాలయానికి దారితీస్తాయి.

దేవాలయంను నగర రాజులు, చోళరాజులు, పల్లవరాజులు అందరు కాలక్రమంలో అభివృద్ధి చేశారు. నగర రాజు కరికాళ చోళ మహారాజుకు



64 వ తరంవాడు కళ్యాణ వెంకటేశ్వరస్వామి వారి దేవాలయ విమానం, గోపురం, ప్రాకారాలు కట్టించాడు.

రాజ భవనాలు దేవాలయానికి ఎదురుగా అరుణానది ఒడ్డున వుండేవి. అవి అన్నీ శిథిలమైపోయాయి. నేడు వాటి ఆనవాలు కూడ లేవు.

శ్రీకళ్యాణ వేంకటేశ్వర స్వామివారికి కార్వేటి నగర రాజు మాకరాజు 15 వ శతాబ్దంలో తన కతారిని సమర్పించుకొన్నాడు ఇప్పటికి ఈ 'కతారి' స్వామివారి పాదాలచెంత కనిపిస్తుంది.

ప్రస్తుతం ఈ దేవాలయం తిరుమల – తిరుపతి దేవస్థానముల వారి ఆధీనంలో వుంది.

పద్మావతి అమ్మవారి ఆలయం ప్రధాన ఆలయం లోపల వుంది. ఇది అమ్మవారికి పుట్టినిల్లు.

శ్రీకళ్యాణవెంకటేశ్వరస్వామి వారికి తిరుమల – తిరుపతి దేవస్థానముల వారి ఆధ్వర్యంలో బ్రహ్మోత్సవాలు ప్రతిసంవత్సరం వైశాఖ మాసంలో జరుగుతాయి. ఇక్కడి పద్మ సరోవరంలో తెప్పోత్సవాలు ప్రతిసంవత్సరం కార్తీక మాసంలో జరుగుతాయి..

నారాయణవనంను ఆనుకొని కెంపుల పాళెం వుంది. ఒకప్పుడు ఇక్కడ కెంపులకు సానపెట్టి అమ్మేవారట. ఇక్కడ అగస్త్యేశ్వరాలయం, అవనాక్షి అమ్మవారి ఆలయాలు వున్నాయి. అమ్మవారిది భారీ విగ్రహం. అమ్మవారికి ఆగస్టు నెలలో జాతర ప్రారంభమై (నవరాత్రిఉత్సవాలు) చాలా వేడుకగా జరుగుతాయి.

శ్రీ అగస్తీశ్వరస్వామి దేవాలయానికి కఠారి సాల్వ మాకరాజు బ్రహ్మదేవ మహారాజు క్రీ.శ.1474 లో కుంభాభిషేకం చేసి పూజారులకు గ్రామాన్ని దానం చేసినట్లు ఒక శాసనముంది.[4] ఈ దేవాలయాలు అరుణానది ఒడ్డున వున్నాయి.

క్రీ.శ.1545 లో తిరుమలరాజు శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామివారి దేవాలయానికి గ్రామదానం చేసినట్లు ఒక శాసనముంది.[5]

శ్రీస్వామివారు, పద్మావతి అమ్మవారు నడయాడిన ఆ ప్రాంతాలైన నారాయణవనం, కెంపులపాళెం, దాని పరిసరప్రాంతాలలో, మనమూ తిరుగుతుంటే కలిగే అనుభూతి మాటలకు అందనిది.

**శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవాలయము - కార్వేటినగరం :-**

దేవాలయం ఎప్పుడు నిర్మితమైందో తెలియదు కానీ ఇది 'చోళ' రాజుల నిర్మాణం.

త్రిభువన చక్రవర్తి రాజరాజ చోళుడు క్రీ.శ.1157 వ సంవత్సరంలో ఈ దేవాలయంలో 80 రోజులు శివ సంబంధ యజ్ఞం చేసి అవిముక్తేశ్వరం (కాశి), ఇల్లకేశ్వరం, అక్కసలేశ్వరం మొదలగు శివాలయాలకు భూ దానం చేసినట్లు ఒక శాసనం తమిళ గ్రంథలిపిలో ఉన్నది.[6]

శాసనంలో 'సాళువ' రాజుల ప్రస్థావన ఉన్నది. అంటే'సాళువ' రాజులు 1000 సంవత్సరాల పూర్వం నుండి ఇక్కడ ఉన్నారని తెలుస్తూంది. 'సాళువ' రాజుల జన్మస్థలం బహుశా ఇదే కావచ్చు.

---

4. Indian Epy No. 376
5. Indian Epy No. 382
6. Indian Epy No. 392 Dt 1911



'రాజరాజ చోళుడు' తమ శాసనంలో 'సాళువ' రాజులను ప్రస్థావించాడంటే దానిని బట్టి వారి గొప్పతనం తెలుస్తూంది. విజయనగర సామ్రాజ్యంలో సాళువ రాజుల ప్రాబల్యం అధికంగ ఉండేది.

సాళువ నరసింహదేవరాయలు విజయనగర సామ్రాజ్యంలో సేనాధిపతిగా వుండి సంగమ వంశంవారు సామ్రాజ్యాన్ని అస్థిరపాలు చేస్తుంటే రాజును తొలగించి తానే రాజైనాడు. సాళువ మంగిదేవ మహారాజు సాళువ నరసింహరాయలుకు మునిమనమడు. ఈ మంగిదేవ మహారాజు 1359 ప్రాంతంలో తిరుమల ఆలయానికి బంగారు పూత వేయించాడు.

సాళువ తిమ్మరసు (మహామంత్రి తిమ్మరసు) మన ప్రాంతంవాడే.

భగవాన్ రామానుజుల తరువాతకాలంలో ఇది విష్ణ్వాలయంగా మారివుండవచ్చు. తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామితోపాటు పూజలందుకొంటున్న శ్రీవేణుగోపాలస్వామివారిని తీసుకువచ్చి ఇక్కడ ప్రతిష్ఠించి నగరరాజులు శివాలయాన్ని వైష్ణవాలయంగా మార్చేశారు. ఈ విధంగా చరిత్రలో చాలా ఆలయాలు మారిపోయాయి.

ఇది అన్నమయ్య కాలంలో జరిగివుండవచ్చు. అన్నమయ్య శ్రీకృష్ణునిపై (వేణుగోపాలుడు) అనేక కీర్తనలు రచించాడు. తిరుమలలో తను నిత్యం సేవించే స్వామివారు లేరని అన్నమయ్య ఒక కీర్తనలో తన ఆవేదనని వ్యక్తంచేశాడు (ఇందిరా రమణు తెచ్చి ఇయ్యరో మాకిటువలె---)

ఈ దేవాలయాన్ని 1989 వ సంవత్సరంలో తిరుమల-తిరుపతి దేవస్థానం వారు దేవాదాయ - ధర్మాదాయ శాఖ నుండి తమ అధీనంలోనికి తీసుకున్నారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు స్వాధీనంచేసుకొనక

ముందే ఆలయం మొత్తం శిథిలమైపోయింది. తిరుమల తిరుపతి దేవస్థానం వారు పరిపాలనా భాధ్యతలు తీసుకున్న తరువాత ఆలయ అభివృద్ధి కార్యక్రమాలుజరుగుతున్నాయి.

శ్రీవేణుగోపాలస్వామివారి మూలవిరాట్టు, మకరతోరణం, గోవు ఏకశిలతో చేశారు. స్వామివారిది అందమైన రూపం, ఎంత చూచినా చూడాలనిపిస్తుంది. భూతకాలంలో దేదీప్యమానంగా వెలిగిన ఆలయం. స్వామివారికి అన్ని వాహనాలు వుండేవి. బంగారు గరుడ వాహనం తిరుమలలోని స్వామివారి వాహనంకన్నా పెద్దది. వాహనం తలను వేరుగ చేయవచ్చు. వాహనంపై వున్న బంగారు పూతను దొంగలు అపహరించుకుపోయారు. ప్రస్తుతం గరుడవాహన శిరస్సు భాగం మాత్రం మంచి స్థితిలో వున్నది. మిగిలిన భాగాలు విడివిడిగా బంగారు పూతలేకుండా వున్నాయి. ఇవన్ని తిరుమల శ్రీవారి ఖజానాలో వున్నాయి.

తిరుమల – తిరుపతి దేవస్థానం వారు కార్వేటినగర గరుడ వాహనాన్ని మరమత్తు చేసి తిరిగి దేవస్థాన ఆలయాల్లో ఉపమోగించవచ్చు.

కార్వేటినగర రాజులు దేవాలయానికి చెందిన స్వామివారి తేరును కంచి వరదరాజస్వామి వారి దేవాలయానికి ఇచ్చేశారు.

ఈ ఆలయ ఆవరణలోనే శ్రీ కోదండ రామస్వామి ఆలయం వుంది.

శ్రీ స్వామి వారి మకరతోరణం, పీఠం ఏకశిలతో చేశారు. మకర తోరణంలో అపురూపమైన శిల్పసంపద వుంది. ధ్వజస్తంభం ప్రత్యేకంగ వుండేది. నైవేద్యం ప్రత్యేక ఘంటానాదంలో జరిగేది. నగర రాజులు ఆలయ ప్రహరీగోడలో ఉత్తరం వైపు ద్వారం ఏర్పాటు చేశారు. అందుచే ఆగమశాస్త్ర ప్రకారం రెండు ధ్వజ స్తంభాలు నిర్మించారు.



ప్రస్తుతం తిరుమల – తిరుపతి దేవస్థానం వారు ఉత్తర ద్వారం మూసి వేశారు. రామాలయ ధ్వజ స్తంభం తొలగించేశారు.

శ్రీ వేణుగోపాలస్వామి ఆలయానికి ఎదురుగ, శ్రీ ఆంజనేయస్వామి గుడికి ముందర ఏకశిల ధ్వజస్తంభం వుంది. ధ్వజస్తంభంను 4 అడుగుల ఎత్తు దిమ్మపై అమర్చారు. ప్రస్తుతం ఆ దిమ్మ పూడిపోయింది. అనగా రోడ్డు 4,5 అడుగులు ఎత్తుపెరిగింది. ఈ విధంగానే గ్రామమంతా ఎత్తుపెరిగింది.

ఈ ధ్వజ స్తంభపు దిమ్మపై ఒక శిలాశాసనముండేది. కాలానుగతంగా అందులోని అక్షరాలు చదవడానికి వీలులేకుండా పోయాయి. ప్రస్తుతం ఆ దిమ్మపై సిమెంటు రోడ్డు వేసేశారు.

ఆంజనేయస్వామి దేవాలయానికి వెనుకవైపు తూర్పుముఖంగా ఒక అలంకార మంటపం వుండేది. ఇది శివాలయానికి సంబంధించినది. ప్రస్తుతం దీనిని తొలగించి, ఆ స్థలంలో స్వాగత తోరణాన్ని నిర్మించారు. దీనివల్ల శ్రీవేణుగోపాల స్వామి దేవాలయానికి మంచి అందం వచ్చింది.

ఇక్కడే సారంగపాణి కంచు విగ్రహాన్ని తిరుమల–తిరుపతి దేవస్థానం వారు ఏర్పాటు చేశారు.

వేణుగోపాల స్వామి వారి ఆలయానికి తరువాత కాలంలో గాలిగోపురం నిర్మించారు. క్రీ.శ. 1779 వ సంవత్సరంలో శ్రీ వెంకట పెరుమాళ్‌రాజు భార్య వెంకటాంబ గారు గోపురం నిరింపచేశారు. ఇది పుర్వం వున్న గోపురము శిధిలమైపోతే నిర్మించినగోపురమా? లేదా శివ సంబంధమైన గోపురాన్ని తొలగించి వైష్ణవ గోపురాన్ని నిర్మించారా? అన్నవిషయం తెలియదు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు గోపురాన్ని మరమత్తులు చేసి రాగి కలశాలను ఏర్పాటు చేశారు. కాలాంతరంలో దానిని తొలగించి బంగారు కలశాలను ఏర్పాటు చేశారు. అందుచే ఆలయానికి అపురూపమైన అందం వచ్చింది.

ప్రతిసంవత్సరం వైశాఖ మాసంలో స్వామివారికి 9 రోజులు బ్రహ్మోత్సవాలను, శ్రావణ మాసంలో 3 రోజుల తెప్పోత్సవాలు నిర్వహిస్తున్నారు. తిరుపతి నుండి A.P. టూరిజం బస్సులు ప్రతిరోజు వస్తాయి.

**నిశ్శంక దుర్గము** :-

నిశ్శంక దుర్గాన్ని 'సాళువ తిప్పదేవ' మహారాజు శ.క సం॥ 1342 దుర్మతినామ సంవత్సరంలో కార్వేటినగర రాజుల సంరక్షణలో నిర్మించాడు. ఈతని తండ్రి సాళువ తిప్పయ్య దేవ మహా అరుసుగళ్. ఈతని శాసనమొకటి సత్రవాడ కరివరద రాజస్వామి దేవాలయంలో ఉంది. నిశ్శంక దుర్గంలో తమిళ, కన్నడ, తెలుగు శాసనాలున్నాయి.

తెలుగు శాసనం సంస్కృత శాసనానికి అనువాదం. సంస్కృత శాసనం తెలుగు లిపిలో వున్నది. శాసనంలో సూర్య, చంద్రుల ప్రశంసలున్నాయి. శాసనంను మాకమహారాజు అల్లుడైన మాకరాజు వేయించాడు. ఇది తెలుగు, కన్నడ లిపులతో కలగలసివుంది. అప్పటికి రెండు భాషల లిపులతొ పూర్తిగ విడిపోలేదు. కాలనిర్ణయం లేదు. 14,15 శతాబ్దాలలో వేసివుండవచ్చు. లేదా దుర్గనిర్మాణ సమయంలోనే శాసనాన్ని వేసియుండవచ్చు.[7]

7. భారతి, మార్చి 1971



దుర్గం చాలావరకు శిథిలమైపోయింది. దుర్గంలో విష్ణాలయం వున్నది. మహామంటపం, అర్ధమంటపం, అంతరాళం, మూలస్థానంలతో ఆలయంఉన్నది. మంటపంలోని ఒక స్తంభంపై అన్నమయ్య విగ్రహం చెక్కియున్నారు. ఆలయం 90 శాతం శిథిలమై పోయింది. గుప్తనిధులు వున్నవనే భ్రాంతితో దుండగులు ఆలయాన్ని మెత్తం త్రవ్వేశారు. మూలవిగ్రహం ఏమైనదో తెలియదు. బహుశా తురుష్కులదాడిలో ధ్వంసమైవుండవచ్చు.

దుర్గామాత ఆలయం, శివాలయంలు పూర్తిగా శిథిలమైపోయాయి. దుర్గంలో త్రవ్వని భాగమంటూ ఏదీ లేదు. ఆంజనేయ స్వామి నిలువెత్తు విగ్రహం ఒక రాతి గుండుపై చెక్కబడి ఉన్నది.

వర్షపు నీటిని. సహజ సిద్ధంగా ఏర్పడిన దొన (నీటి నిలువస్థానము) ల్లో నిలువచేసుకొని ఆ నీటిని సంవత్సరమంతా త్రాగునీటికోసం ఉపయోగించు కొనేవారు. కోట వెలుపలికి రహస్య మార్గం వుండేది. అదికూడా శిథలమైపోయింది.

సాళువ రాజులు సంఘటితంగ వుండేవారు. సైనికపరంగాబలమైన నిర్మాణము గావించుకొన్నారు. వారిపై గౌరవంతో నగరరాజులు, విజయనగర రాజులు తమ పేర్లకు ముందుగ 'సాళువ' అనే బిరుదు నామాన్ని ధరించేవారు.

సాళువ రాజులు, నగర రాజుల మధ్య వివాహ సంబంధాలు జరిగి ఉండవచ్చు. ఇచ్చి పుచ్చుకొని ఉండవచ్చు. చాలా వంశాలవారు వారి వారి రాజ్య క్షేమాన్నికోరి ఇటువంటి వివాహాలు చేసుకొనేవారు.

నగరరాజులు తమపేర్లకు ముందుగ 'కఠారి' అని, 'సాళువ' అని చేర్చుకొనేవారు. ఈ బిరుదులు నగరరాజులు తప్ప వారి బంధువులు ఎవరూ వేసుకొనేవారు కాదు.

'తళ్ళికోట' యుద్ధానంతరం తురుష్కులు వరాహ లాంఛనం కలిగిన హైందవ రాజ్యాలపై సావధానంగా దాడులు ప్రారంభించారు. ఆ క్రమంలోనే నిశ్శంక దుర్గంపై, కార్వేటినగరంపై దాడులకు తెగబడ్డారు. దుర్గాన్ని సర్వ నాశనం చేశారు. నగరరాజైన మాకమహారాజు నిశ్శంక దుర్గ సమీపంలో నిర్మించిన నిశ్శంకపురిని, కూడ తురుష్కులు నామరూపాలు లేకుండాచేశారు. కనీసం గ్రామశిథిలాలుకూడా మిగలలేదు. 'సాళువ' రాజుల ప్రాభవం అంతరించడం ఆరంభమైంది. కార్వేటినగరం కూడ దీనికి మినహాయింపేమీ కాలేదు. కాలాంతరంలో హైదరాలి, టిప్పుసుల్తాన్‌లు కూడ నిశ్శంకదుర్గంపై, కార్వేటినగరంపై దాడి చేశారు.

**కార్వేటినగరం :-**

కార్వేటినగరం వేల సంవత్సరాలకు ముందు నిర్మింపబడిన నగరం. శ్రీ సదాశివేశ్వరస్వామి దేవాలయం, శ్రీప్రసన్నవెంకటేశ్వరస్వామి దేవాలయం, శ్రీబంగారమ్మ దేవాలయం శ్రీ వేణుగోపాలస్వామి దేవాలయం, శ్రీ వినాయక స్వామి దేవాలయం, శ్రీ కాశీవిశ్వనాథస్వామి దేవాలయం ఇక్కడి ప్రధాన ఆలయాలు. ఇక్కడ పూర్వం వీధికొక రామమందిరం ఉండేది.

వీధులన్నీ ఒకదానికొకటి సమాంతరంగా ప్రతి వీధి రాజమార్గంలోకి వచ్చేవిధంగా, బొడ్డుచౌక (రాజుల కళ్యాణ మంటపము) కేంద్రంగా, దానిచుట్టూ రాజభవనాలు, ఆ తరువాత ప్రజా నివాసాలు వుండేవి.



రాజవీధి తూర్పు – పడమరలుగావుండేది. 5 అంతస్తులతో హజారం అసంపూర్తిగా వుండేది. దానికొక ఇనుప గేటు వుండేది దానివెనుక కొంత ఖాళీస్థలం, దానివెనుక పడమరన దర్బారు మందిరం రంగూన్ టేకు కలపతో అపురూపమైన కళా సంపదతో వుండేవి. ఈ దర్బారు మందిరంలో బ్రిటీషువారు రెండవ ప్రపంచయుద్ధంలో గెలిచినందున 'విజయం', victory అని గోడపై ఎర్రటి అక్షరాలు చాలాపెద్దవిగ వ్రాసి యుండేవి. ప్రస్తుతం దర్బారు మందిరం, హజారం రెండూ లేవు. ప్రభుత్వం వారు దానిలోని కొయ్యలను (శిల్పసంపద) భవనాలను పడగొట్టి శిల్ప సంపదను పెకలించి వేలము వేసి అమ్మి వేసి పురాతన కళాసంపదను కాపాడారు. ఆ సంపద దేశం దాటిపోయింది.

రాజుగారు సింహాసనం వేసుకొనే స్థలంలోని శిల్పం అపురూపమైంది. స్తంభాలకు గుర్రపురౌతు బల్లెంతో పులిని వధించేభంగిమలో వుండేవి. అవి దొంగల పాలయ్యాయి.

బొడ్డుచౌక అనబడే కట్టడం విలక్షణమైంది. ఇది అష్ఠభుజాలతో, ఎనిమిది అర్చీలతో అలరారే రాజుల కళ్యాణమంటపం. ఇది కూడా గోడలు తప్పితేమరేమి మిగలలేదు. గోడలపైభాగంలో రాజ చిహ్నం వరాహం, సూర్యచంద్రులు, కఠారి నిర్మించారు. దీని చుట్టూ కళ్యాణ సమయంలో కూర్చొనేందుకు వసతివుండేది. ప్రస్తుతం ఇక్కడ ఖాళీస్థలం మాత్రమేఉంది. కళ్యాణమంటపానికి వెనుక పడమరవైపు 'చంద్రశాల' అనబడే రాణివాస సముదాయాలు వుండేవి. అవి అన్నీ శిథిలమైపోగా రాజ సంబంధీకులు ఆస్థలాన్ని వాటాలు వేసుకొని అమ్మివేశారు.

ఈ చంద్రశాలలో 'కృష్ణకూటము' అనబడే దేవునిమందిరం, ధనాగారం వుండేవి.

రాజ భవనాలకు ఉత్తరంగ ప్రస్తుతం జూనియరు కళాశాల వున్న ప్రాంతంలో జమీందారి ముద్రణాలయం 'శ్రీలీలా భారతి ముద్రాక్షరశాల' పేరుతో వుండేది. జమీందారి వ్యవహారాలు, కావ్యాలు, ఇతరాలు ఇక్కడే ముద్రితాలయ్యేవి. ఇది దేశ స్వాతంత్ర్యానికి ముందే అమ్మివేయబడింది. దాని ప్రక్కనే జమీందారి వ్యవహారాలు చూచే కార్యాలయం వుండేది. ప్రస్తుతం ఇవేమి లేవు. ఇవన్నీ విద్యార్థుల ఆటస్థలంగా మారిపోయాయి.

దర్బారు హాలుకు ముందర తూర్పువైపు పెద్ద ఖాళీస్థలం వుంది. ఇక్కడ సభికులు, గ్రామవాసులు, రాయబారులు ఇతరులు కూర్చొనేవారు. ఈ ఖాళీస్థలంలోనే దశరా ఉత్సవాలు జరిగేవి. ఈ స్థలానికి దక్షిణంవైపు 'లక్ష్మీమహాలు' అనబడే రాజభవనం 17 వ శతాబ్దం చివరి భాగంలో నిర్మితమైంది. ఇది కూడా శిథిలావస్తకు చేరుకొంటూంది. దీనిలో ఏ రాజులు కాని, రాణులు కాని నివసించలేదు. ప్రస్తుతం దీనిలో ఉన్నత పాఠశాల వుంది. దర్బారుమందిరం పడగొట్టి ఆ స్థలంలోను ఉన్నత పాఠశాలను నిర్మించారు. ఈ భవనాలన్నీ శ్రీ కుమారస్వామి రాజావారు (కడపటి రాజు) ప్రభుత్వ పాఠశాలకు ఇచ్చేశారు.

ఈ ప్రాంతమంతా 5,6 అడుగుల ఎత్తు పెరిగింది. రాజవీధి చాలావరకు ఆక్రమణలకు గురయ్యింది. సైనిక కవాతులు, చతురంగ బలాలు తిరుగాడే ప్రాంతం నేడు ఇరుకువీధి అయిపోయింది

**పుష్కరిణి :-**

ఇది 13 ఎకరాల్లో నిర్మితమైన రాతిమెట్లు కలిగిన సుందరమైన కట్టడం. రాతిమెట్లు గీత గీచినట్లుగ చాలా చక్కగ వుంది. ఈ పుష్కరిణి దీర్ఘచతురస్ర ఆకారంలో వుంది. నిర్మాణం జరిగి 200 సం॥ పైన కావస్తున్నది అయినా



ఏమాత్రం చెక్కు చెదరలేదు. ప్రస్తుతం ఇందులో శ్రీ వేణుగోపాలస్వామి వారికి, శ్రీ కోదండరామస్వామి వార్లకు తెప్పోత్సవాలు జరుగుతున్నాయి. ఇక శివాలయం వీధిలో ప్రస్తుతం నీళ్ళట్యాంకు, అంగనవాడి భవనాలున్నచోట వినాయకుని దేవాలయంవుండేది. అర్ధమంటపం, అంతరాళం, మూలస్థానాలతో చుట్టూ పరిక్రమ చేసేందుకు వీలుగ వుండేది. ఇది 40,50 ఏళ్ళ క్రితమే శిథిలావస్తకు చేరిపోయింది. అందులోని విగ్రహం దొంగిలింపబడి గ్రామం దాటిపోయింది. రాతి విగ్రహమైనా గోటితో తట్టినా లోహంవలె శబ్దం వచ్చేది.

శ్రీ కాశీవిశ్వేశ్వరుని దేవాలయం దక్షిణ వాకిలితో వుంది. ఈ ఆలయానికి ఒక పుష్కరిణి వున్నది. పుష్కరిణి పూర్తిగా శిథిలమైపోయింది. దానితో పాటు దేవాలయం కూడ శిథిలమైంది.

కార్వేటినగరంలోని కాశీవిశ్వనాథుని దేవాలయానికి అనుబంధంగా ఒక ధర్మసత్రము, అలంకార మండపము ఉండేవి. ఈ ఆలయ ఆవరణంలోని ధర్మసత్రమును 'దారుకావనమని' పిలిచేవారు. గుజరాత్‌లోని ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన 'నాగేశం' ను దారుకావనమని వ్యవహరిస్తారు. దానికి ప్రతిగ కార్వేటినగరంలోను దారుకావనాన్ని నగరరాజులు ఏర్పాటు చేశారు.

ఊరిచుట్టు పండ్ల తోటలు విశేషంగా వుండేవి. అన్నిరకాల పండ్లు పండేవి. ఇవి ఎక్కువ భాగం రాజు అధీనంలో వుండేవి. ఈ తోటల్లో రాజ భవనాలకు తూర్పు దిక్కున రాణులుస్నానం చేసే అష్టభుజి బావి వుండేది. ఈ బావిని ఆనుకొని భూగృహం వుండేది. బావిలోనికి నీరు భూగృహం



శ్రీ వేణుగోపాలస్వామివారి దేవాలయము ప్రవేశద్వారము



పుష్కరిణి - కార్వేటినగరము




శ్రీ వీరాంజనేయస్వామివారు నిశ్శంక దుర్గము - కార్వేటినగరము



హజారము (శిథిల భాగము) – కార్వేటినగరము



లక్ష్మీమహలు లోపలి భాగము – కార్వేటినగరము



రాజ భవనముల ప్రవేశ ద్వారము నిశ్శంక దుర్గము – కార్వేటినగరము



కోట చెరువు బురుజు – కార్వేటినగరము



రాజుల కళ్యాణమంటపము - కార్వేటినగరము



రాణుల స్నానఘట్టము (ప్రవేశద్వారము) - కార్వేటినగరము



బొడ్డు చౌక రాజుల కళ్యాణమంటపము - కార్వేటినగరము



రాణుల స్నానఘట్టము - కార్వేటినగరము



శ్రీ కార్వేటినగర సంస్థాన రాజముద్రిక



వీరుల సమరము - పొలాల్లో పడివున్న శిల్పం



యుద్ధ దృశ్యము – కార్వేటినగర పంట పొలాల్లో లభించినది

వెలుపలినుండి వచ్చేది. వచ్చిన నీరు వెలుపలికి పోవడానికి ఏర్పాటు చేయబడి ఉండేది. భూగృహంలోనికి వెళ్ళడానికి రాతి మెట్లు ఏర్పాటు ఉండేది. ప్రస్తుతం ఇవి శిథిలమైపోయాయి.

ఈ నిర్మాణము నైమిశారణ్యములోని చక్రతీర్థమును పోలివుంటుంది.

ప్రస్తుతం కార్వేటినగరంలో రాజుల గొప్పతనాన్ని చాటే కట్టడాలలో మిగిలినవి పుష్కరిణి, శ్రీ వేణుగోపాలస్వామి వారి దేవాలయం మాత్రమే.

**మతము** :–

నగర రాజులు వైష్ణవమును, శైవమును సమానంగ ఆదరించారు. రాజ్యమంతటా శివాలయాలు, వైష్ణవ ఆలయాలు వున్నవి. దీనికి తోడు శాక్తేయం కూడ బలంగ వుండేది. నగర రాజులు స్వయంగా వామాచారమును ఆదరించి ఆచరించేవారు. దీనికి ప్రబల తార్కాణం 'శ్రీబంగారమ్మ'

బంగారమ్మది విలక్షణమైన విగ్రహం. అమ్మ వారు కూర్చున్న స్థితిలో వుంటుంది. సుమారు పీఠముతో సహా 1–1/4 అడుగు వుండవచ్చు. కొయ్య విగ్రహానికి బంగారు రేకు (అపరంజి) తాపడం చేయించారు. అమ్మవారు కాళికాదేవి, అన్నపూర్ణాదేవి కలగలసిన రూపం.

అమ్మవారు చతుర్భుజాలతో. త్రిశూలం, ఢమరుకం, కత్తి(కఠారు) అక్షయపాత్ర ధరించియున్నది.

అన్నపూర్ణాదేవి దక్షిణాచారములో సాత్విక పూజలు అందుకొనే తల్లి. ఆమెను వామాచారంలోనికి రప్పించి, జంతుబలులతో పూజలు చేసేవారు. మాంసం, మద్యం నైవేద్యంగ ఇచ్చేవారు. ఒక్క వామాచారంలోనే ఈ విధంగ

పూజలు జరుగుతాయి. స్వయంగ రాజావార్లు తాంత్రిక పద్ధతుల్లో పూజలు చేసేవారు. ఈ బంగారు విగ్రహం సంవత్సరం అంతా రాణివాసంలోవుండి రాజులతో పూజలు అందుకొనేది. సంవత్సరంలో 3 రోజులు మాత్రమే (కార్తీకమాసంలో) రజకుల ఆధ్వర్యంలో గ్రామస్తులు జరిపే జాతరకు మాత్రం బంగారు విగ్రహం గ్రామంలో ఊరేగింపుగా తిరుగుతుంది.

ప్రస్తుతం రాజులు ఎవ్వరు లేరు. ఈ బంగారమ్మ తల్లి విగ్రహం గ్రామప్రజల ఆధీనంలో వుండిపోయింది. కడపటి రాజుగారు కుమారస్వామిరాజు బంగారు విగ్రహాన్ని స్వయంగ గ్రామస్థులకు స్వాధీనం చేశారు.

దశరా ఉత్సవాలు కూడ 9 రోజులు జరిగేవి. జంతుబలులు సాగేవి. అప్పట్లో రాజులు సమీప అరణ్యాలనుండి పులిని పట్టి బంధించి తెచ్చి చంపేవారు. ఇది దేశ స్వాతంత్ర్యానికి చాలాకాలం ముందుగానే నిలిచిపోయింది. యుద్ధాలతో, బ్రిటీషు వారు సంస్థానాన్ని పూర్తిగా తమ ఆధీనంలోకి తెచ్చుకోవడంవల్ల సంస్థాన ఆదాయం తగ్గిపోయింది అన్ని ఉత్సవాలు నిలిచిపోయాయి. (1802 సం॥ సంస్థానమును బ్రిటీషు వారు వశపరచుకొన్నారు.)

ఇక నగర రాజులు జైన మతాన్నికూడ ఆదరించారు. కుశస్థలి నదీతీరంలో తిరుత్తణి – మద్రాసు మార్గంలో తిరుత్తణి నుండి 20 కి.మీ॥ ప్రధాన రహదారికి 5 కిలో మీటర్ల దూరంలో 'అరుంగోళం' అనే గ్రామంలో (తమిళనాడు) జైన దేవాలయాన్ని నిర్మింపజేసి దానికి మాన్యం కూడ ఏర్పాటు చేశారు. క్షేత్రపాలిక 'కాళికాదేవి'. అమ్మవారి పూజలు దక్షిణాచారంలో



జరిగేవి. మాన్యాలు అన్యాక్రాంతాలైపోయాయి. మద్రాసు నుండి జైనులు వచ్చి పూజాదికాలు చేస్తుంటారు.

సాత్విక దేవతలకు జంతు బలులు, ఉగ్ర దేవతలకు సాత్విక పూజలు ఒక్క వామాచారంలో మాత్రమే జరుగుతాయి. రాజ్యంలో చాలా చోట్ల అమ్మ వార్ల విగ్రహాలు ఉన్నాయి. పళ్ళిపట్టు దగ్గర ఈచంబాడి (తమిళనాడు) గ్రామంలో 'శీతలాంబదేవి' నిలువెత్తు దారు విగ్రహం కూర్చున్న స్థితిలో వుంది. నేడు అన్నీ శిథిలమైపోయాయి. ప్రతిగ్రామానికి గ్రామదేవత వుండి వామచారంలో పూజలందుకొంటున్నది.

**హంపి – కార్వేటినగరం :-**

హంపి విజయనగర సామ్రాజ్య రాజధాని. 'తళ్ళికోట' యుద్ధానికి ముందు వైభవంగ జీవించిన నగరం. ఆ యుద్ధానంతరం రాజుప్రాణభీతితో, అందినంత సంపదతో పెనుగొండకు/చంద్రగిరికి పారిపోయాడు. రాజు లేడు, రక్షణ లేదు. ముస్లింలు ప్రతీకారేచ్ఛతో సాగించిన విధ్వంసంతో హంపి సమూలంగ నేలమట్టమైపోయింది. ఏది రాజ భవనము, ఏది సామాన్యుల ఇల్లు అని పోల్చుకోలేనంతగ విధ్వంసం జరిగిపోయింది.

లక్షలాదిమంది పారిపోయారు. పారిపోలేనివారు చంపబడ్డారు. ఆపార సంపద అన్యాక్రాంతమైపోయింది. ఎన్నో గ్రంథాలు అగ్నికి ఆహుతై పోయాయి. నేడు హంపిలో ఇచ్చట ఒక మహానగరం ఉండేదనే ఆనవాలు ఎక్కడాలేదు. కనీసం శిథిలమైన గోడలు కూడలేవు. తుంగభద్రానదిలో వున్న రాతి గుండ్లు దర్శనమిస్తాయి.

అళియ రామరాజు యొక్క మితిమీరిన అహంకారం, అంచనా లోపం, ఆలోచనాలోపాలతో ఒక మహాసామ్రాజ్యం పునాదులతోసహా

కూలిపోయింది. అద్భుతమైన శిల్పసంపద ముక్కలైపోయింది. దానితోపాటు అపార సంపద కూడా నశించిపోయి వుంటుంది.

యుద్ధంలో పాల్గొన్న సేనావాహినుల్లో ప్రధానంగ సాళ్వరాజులు బలవంతులు. మెదటి దాడి వారిపైనే జరిగింది.

నిశ్శంక దుర్గం, నిశ్శంకపురి, కార్వేటినగరాలపై మహమ్మదీయులు అనేకమార్లు దాడులు చేసి విధ్వంసం సృష్టించారు. నిశ్శంకపురి, నిశ్శంక దుర్గం నామరూపాల్లేకుండా పోయాయి.

శా.శ॥ 1612 న బ్రహ్మరాజు వారి భార్య రాఘవమ్మ దేవులవారు శ్రీ సదాశివేశ్వరస్వామి దేవాలయాన్ని తిరిగి నిర్మాణం చేస్తే శా.శ॥ 1682 లో శ్రీ నరసింహరాజు భార్య తిరుమల కొండమ్మగారు దేవాలయ జీర్ణోద్దరణ గావించారు. అంటే ఆ రెండుసార్లు కార్వేటినగరంపై బలమైన దాడులు జరిగాయన్నమాట.

అందుకే అచ్చట వున్న జనావాసాలను ఖాళీచేయంచి వుండవచ్చు. దేవాలయం మాత్రం మిగిలిపోయింది. వారందరు ఆ శిథిల గృహ వస్తువులతో మరలా నివాసాలు వేరేస్థలాల్లో నిర్మించుకొన్నారు.

ఈ దాడులలో శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామి ఆలయం తిరిగి నిర్మించడానికి వీలులేకుండ ధ్వంసమైతే స్వామి వారిని అప్లాయగుంటకు తరలించి అచ్చట దేవాలయం నిర్మించారు. ఇదికూడా ఖజానాలో డబ్బులులేక అసంపూర్తిగా నిలచిపోయింది.

తిరుమల తిరుపతి దేవస్థానముల వారు అప్లాయగుంట ఆలయాన్ని తమ ఆధీనంలోనికి తీసుకొని తగిన అభివృద్ధి చేస్తున్నారు.



ప్రస్తుతం కార్వేటినగరంలో శ్రీ ప్రసన్న వెంకటేశ్వరస్వామి వారి ఆలయ ఆనవాలు కూడ లేదు.

అప్పట్లో రాజులు ప్రతిదేవాలయం పరిపుష్ఠంగా వుండేందుకు దేవాలయ మాన్యాలు ఏర్పాటుచేసి, వస్తు, ద్రవ్యవితరణ చేసేవారు. స్వామివార్లకు కావలసిన బంగారు ఆభరణాలు రాజులే చేయించేవారు.

నేడు దేవాలయ మాన్యాలన్నీ పరుల ఆధీనమైపోయాయి. అప్పట్లో దేవుడి మాన్యం అంటే భయ భక్తులతో చూసేవారు. ప్రస్తుతం ఎంత వీలైతే అంత స్వాహా చేస్తున్నారు.

**సాంఘికజీవనము :-**

కుశస్థలి నదీ పరీవాహక ప్రాంతమంతా, షోలింగరం, తిరువళ్ళూరు, చంద్రగిరి మధ్యప్రాంతమంతా నగర రాజ్యంలో వుండేది. రాజ శాసనం కఠినంగ అమలు జరిగేది. వ్యవసాయమే ప్రధాన జీవనాధారం. రాజుతప్పితే మరెవరూ భవనాలు నిర్మించరాదనే చట్టం అమలులోవుండేది.

రాజు తన రాజ్యంలో ఎవరు ఏ ప్రాంతంలో పౌరోహిత్యం చేయాలో నిర్ణయం చేసేవారు. నేటికిన్ని చాలా ప్రాంతాల్లో అప్పట్లో రాజుగార్లు ఏర్పాటు చేసిన విధంగానే పౌరోహిత్యం వంశపారంపర్యంగా జరుగుతున్నది. రాజధాని కార్వేటి నగరంలో వేలమంది బ్రాహ్మణులు వుండేవారు. నేడు పౌరోహిత్యం చేయడానికి ఒక్క బ్రాహ్మణుడు కూడ లేడు.

రాజు తన రాజ్యంలో అచ్చటచ్చట విహారాలు చేసేందుకు విడిదులు వుండేవి. రాజుగార్లు వచ్చునపుడు ఆ యా గ్రామాలకు ముందుగ సమాచారం చేరవేసేవారు. రాజధాని చుట్టుప్రక్కల ఎవరు అడవిలో జంతువులను

వేటాడితే వారు రాజుగారి భాగం (మాంసం) దివాణానికి చేర్చాలనే నియమం వుండేది. ఇది కచ్చితంగా అమలు జరిగేది.

జాతరలు, తిరుణాళ్ళు జరిగేవి. మహాభారతం ఉత్సవాలను, నాటక రూపంలో జరిపేవారు. జాతర్లలో విచిత్ర వేషధారణ వుండేది. వాటికి రాజాదరణ వుండేది. వీధిబడుల్లో విద్య నేర్పేవారు. వ్యాయామశాలల్లో సాము గరిడీలు నేర్పేవారు. రాజులు సొంతంగ నాణాలు వేసేవారుకారు. చోళులు, విజయనగర రాజులు, ముస్లింలు, ఆంగ్లేయులు అందరి నాణేలు చలామణిలో వుండేవి. వస్తుమార్పిడి కూడ జరిగేది. భజన మండళ్ళు ప్రతి రామమందిరానికి వుండేవి. దేవదాసి విధానం వుండేది. కార్వేటినగరంలో చాలామంది దేవదాసి కుటుంబాలు వుండేవి.

వ్యవసాయం ప్రధాన వృత్తి. రాజ్యమంతటా నగర రాజులు చెరువులు నిర్మాణం చేశారు.

రెండు కొండలను కలిపి చిన్న ఆనకట్టతో పెద్ద జలాశయాన్ని నిర్మించె విధానాన్ని అమలుచేసి గొప్ప గొప్ప చెరువుల నిర్మాణం చేశారు. ఒక్క సారి చెరువు నిండిందంటె సంవత్సరం పొడుగునా నీటిలభ్యత వుండేది. ప్రత్యేకించి కార్వేటి నగరానికి ఏ పరిస్థితులలోను నీటికరవు రాకుండా జలాశయాల నిర్మాణం చేసుకొన్నారు.

**కుశస్థలి నది :-**

'కుశస్థలి'. నగర రాజ్యంలో ప్రధానమైన నది. సంవత్సరం పొడుగునా నీరువుంటుంది. నగర రాజ్యంలోని 90 శాతం దేవాలయాలు ఈ నదీ తీరంలోనే వున్నాయి.



కావేరీనదీ తీరంలో ఎంత నాగరికత విలసిల్లిందో ఈ కుశస్థలీ నదీ తీరంలోను అదేవిధంగ దేవాలయాలు నిర్మాణం చేసి చాలా గ్రామాలు నిర్మింప చేశారు. అటు వ్యవసాయం, ఇటు త్రాగునీరు సమృద్ధిగా వుండేటట్లు చూచుకొన్నారు.

ఆలత్తూరు శ్రీవరదవేంకటేశ్వరస్వామి దేవాలయం మొదలు పెరమానెల్లూరు (తమిళనాడు) లో శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయంతో ముగుస్తుంది. ఆ తరువాత కుశస్థలి నది సముద్రంలో కలసిపోతుంది.

ప్రతి దేవాలయానికి మాన్యాలు (భూములు) వుండేవి. ఆ భూముల్లో వచ్చే ఆదాయంతో నిత్య ధూప, దీప, నైవేద్యాలు జరిగేవి.

పళ్ళిపట్టు (తమిళనాడు) దగ్గర 'ఈచంబాడి' అనేగ్రామంలో శివాలయం, విష్ణ్వాలయం, శక్తి ఆలయం (శీతలాంబదేవి) ఉన్నాయి. విష్ణ్వాలయంలో స్వామి వారు కూర్చున్న స్థితిలో వుంటారు (కుశస్థలి నదీ తీరంలోని) ఇవన్నీ శిథిలమై విగ్రహాలు స్థానభ్రంశమైపోయాయి.

క్రీ.శ 1012 - 1014 సం॥ 'రాజేంద్ర చోళుడు' శ్రీలంకను జయించినట్లు వేయించిన తమిళ శాసనం ఇక్కడి శివాలయంలో ఉన్నది.

నగరి కరియమాణిక్యస్వామి దేవాలయం, బుగ్గశివాలయం తిరుమల - తిరుపతి దేవాలయం వారి ఆధీనంలో వున్నాయి.

రాజులు శిథిలమైతే దేవాలయాలు కూడ శిథిలమైపోయాయి.

కుశస్థలి నదీతీరంలో సుమారు 30 దేవాలయాలు వెలసినవి. అన్నీ గొప్ప గొప్ప దేవాలయాలే.

ఇక అరుణానది తీరంలో నారాయణవనం, కైలాసకోన, రామగిరి వాలీశ్వరస్వామి దేవాలయం, నాగలాపురం వేదనారాయణస్వామి దేవాలయం, శ్రీపళ్ళి కొండేశ్వరస్వామి దేవాలయాలు వెలిశాయి. ఇవి అన్నీ నగర రాజ్యంలోని దేవాలయాలే.

**నాగలాపురము :-** ఇది అరుణానదీ తీరంలో వెలసిన గ్రామం. దీనిపూర్వ నామం 'అరికొండా పురం'. శ్రీకృష్ణదేవరాయల తల్లి నాగలాంబ పేరుతో కృష్ణదేవరాయల కాలంలో పేరుమార్చారు.

కృష్ణదేవరాయల బాల్యం ఇచ్చటనే గడిపి వుండవచ్చు. తిమ్మరసుతో కలయిక ఇక్కడే జరిగి వుండవచ్చు.

శ్రీవేదనారాయణస్వామి దేవాలయం గణిత, ఖగోళశాస్త్రాల మేళవింపుతో నిర్మితమైనది. గ్రహగమనాన్ని ఖచ్చితంగ నిర్ణయించి దేవాలయం నిర్మించారు.

సంవత్సరంలో 3 రోజులు సూర్య కిరణాలు స్వామి వారిని చేరుతాయి.

**సంగీత, సాహిత్యములు :-**

కార్వేటి నగరంలో ఎన్నో గ్రంథాలు ముద్రించబడ్డాయి. రాజులకు ప్రత్యేకంగ గ్రంథాలయం వుండేది. అందులో అరుదైన గ్రంథాలు వుండేవి. ఆంగ్ల గ్రంథాలు కూడ ఉండేవి. వైద్యంలోను అన్నిరకాల విధానాలకు సంబంధించిన గ్రంథాలువుండేవి. రాజు వద్ద ప్రాపకం వున్నవారు వాటిని తీసుకొని అన్యాక్రాంతం చేసేశారు. ఆంగ్లగ్రంథాలు ఏవీకాని ప్రస్తుతం గ్రామంలో లేవు.



శైవ, వైష్ణవ కవులు తమ ప్రతిభాపాటవాలు చూపి రాజుల సన్మానం పొందేవారు. వారి గ్రంథాలు రాజులకు అంకితమిచ్చేవారు. నేడు ఆ గ్రంథాలు ఏవీలేవు. కనీసం ఆ జ్ఞాపకాలను మిగుల్చుకొన్నవారు లేరు. ఏవో పుస్తకంలో ప్రస్తావించిన పుస్తకాలు మాత్రం కొన్ని వుండవచ్చు.

రాజులు సంగీతాన్ని చాలా బాగ ఆదరించారు. దానితో పాటు నాట్యాన్ని కూడ ఆదరించారు. వాగ్గేయకారులు, వైణికులు, నాట్యాచార్యులు అన్నిరంగాల్లో ప్రావీణ్యం కలిగిన వ్యక్తులు రాజాస్థానంలో వుండేవారు.

గోవిందసామయ్య, కూవనసామయ్య, కూవన గోవిందయ్య, నగరం జగన్నాథకవి, వేదం రామయ్య, కవి కృష్ణయ్య (ఆస్థాన చివరి కవి) లాంటి కవులు అనేకమంది వుండేవారు. ఈ కవులు వ్రాసిన గ్రంథాలు ఏవీ ప్రస్తుతం లేవు. అన్నీ కాలగర్భంలో కలసిపోయాయి.

కన్నాంబ, ఋష్యేంద్రమణి, నాగయ్య, వేమూరు గగ్గయ్య మొ॥ ఆధునిక కాలాని చెందిన అనేకమంది నటులు ఈ రాజాస్థానమునకు వచ్చి తమ నటనతో రాజులను మెప్పించి సన్మానములను పొందినవారే.

కానీ కార్వేటినగరం ఏ వైభవాన్ని మిగుల్చుకోలేక పోయింది. గ్రంథాలు ఎవరికి తోచింది వారు సొంతం చేసుకొన్నారు. కనీసం వారైనా వాటిని మిగుల్చుకొన్నారా అంటే, లేదనే సమాధానమే వస్తుంది.

రాజుగార్లు తముసొంతంగా వుంచుకొన్న గ్రంథాలన్నింటిని పంచాయితి గ్రంథాలయానికి అప్పజెప్పారు. అక్కడ కూడ ప్రస్తుతం ఏమీ లేవు.

'శ్రీ లాలా లజపతిరాయి' పేరుతో పంచాయితీ గ్రంథాలయం సన్నిధి వీధిలో వుండేది. నేడు ఆ స్థలమును అన్యాక్రాంతం చేశేశారు. గ్రంథాలన్నీ తలో దిక్కుకు పోయాయి.

ఇచ్చటి పద్మసరస్సులో 'గజేంద్రమోక్షం' ఉత్సవం జరిగేది. పురాణ ప్రవచనం, ప్రసాద వితరణ, బ్రాహ్మణులకు దక్షిణలు జరిగేవి. ఇది కూడా జమీందారి ఆంగ్లేయుల వశమైనతర్వాత నిలచిపోయింది.

విజయ నగర సామ్రాజ్యంతో సంగీత సాహిత్యాల్లో పోటీపడి వారితో పాటు అంతమైపోయారు కార్వేటినగర రాజులు.

**ముగింపు** :-

కార్వేటినగర రాజులు వారిశాసనాల ప్రకారం వేల సంవత్సరాలుగా రాజ్యపరిపాలన గావించారు. వీరు శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి పరమభక్తులు.

దేవాలయనిర్మాణాలు, దాన కార్యక్రమాలు, సహజంగ జరిపేవారు. అవి తమ బాధ్యత అని భావించేవారు. 14,15 శతాబ్దాల వరకు వీరిశాసనాలు పెద్దగాలేవు. ఆ తరువాత ఒకరో, ఇద్దరో రాజులు శాసనాలు వేశారు.

ఆ తరువాత కొందరు వారిభార్యల పేరున శిలాశాసనాలు వేయించారు. దుర్గశాసనం ప్రకారం 144 మంది రాజులు శాసనానికి ముందుగా పరిపాలన చేశారు, ఆ తరువాత 23 మంది =167 రాజులు మెత్తము 167+1 మంది రాజులు అవిచ్ఛిన్నంగ రాజ్యపరిపాలన చేశారు. వీరు ఎన్నో యుద్ధాలను ఎదుర్కొన్నారు. మరెంతో వినాశనాన్ని కళ్ళారా చూచారు.

ఎంతో సంపదను దానం చేశారు. మరెంతో సంపద అన్యాక్రాంతం అయిపోయింది. ఇవన్నీ సహించుకొని జీవితాల్ని సాగించారు.

కడపటి రాజు శ్రీ కుమారస్వామి రాజు 1952 వ సం॥ చనిపోయారు. వీరు మద్రాసు శాసనసభ సభ్యుడిగ (MLA) వుండి చనిపోయారు. వీరి



అన్నగారు శ్రీ వెంకట పెరుమాళ్ రాజు 1940 లో చనిపోయారు. వీరిరువురికి సంతానం లేదు.

శ్రీ వెంకట పెరుమాళ్ రాజు చనిపోయేటప్పటికే జమీందారి సంపద ఏమీలేదు. శ్రీ కుమారస్వామి రాజు మృతితో జమీందారి పూర్ణమైపోయింది.

**సారంగపాణి :-** అన్నమయ్యవలె పద కవిత్వం వ్రాసినవారు సారంగపాణి. ఇతను అన్నమయ్య తరువాత కాలంవాడు. కాల నిర్ణయం కచ్చితంగా చెప్పలేము. 1700 – 1750 ప్రాంతములో వుండి వుండవచ్చు. ఇతని స్వవిషయం ఇతని పదాల్లో ఎక్కడా కనిపించదు. సంగీతంలో ప్రవేశమున్నవాడు. అందుచే తన పాటలకు (పదాలకు) తానే రాగం, తాళం వ్రాసుకొన్నాడు.

అన్నమయ్య – సారంగపాణిలలో ఒక సారూప్యం వుంది. ఇరువురూ శ్రీ వేణుగోపాలునిపై పదాలు అల్లినవారే. ఇరువురూ శ్రీ వేణుగోపాలుని పూజించినవారే.

సారంగపాణి కాలంలో సాధు, సన్యాసులు ఈతని పదాలు పాడు కొనేవారట. నేడు సారంగపాణి అంటే ఎవరికీ తెలియదు.

శ్రీ తిరుమల – తిరుపతి దేవస్థానం వారు సారంగపాణి కంచు విగ్రహాన్ని దేవాలయ స్వాగత తోరణం వద్ద ఎర్పాటు చేశారు. సారంగపాణి శ్రీ వేణుగోపాలునిపై అందమైన కీర్తనలు వ్రాశాడు. కవి తప్ప కాలం తెలియని సారంగపాణి కార్వేటినగర రాజాస్థానంలో వుండి శ్రీ స్వామి వారిని సేవించుకొన్నాడు.

తిరుమల – తిరుపతి దేవస్థానము వారు సారంగపాణి పదాలను CD రూపంలో తీసుకవచ్చే ప్రయత్నం చేస్తున్నారు.

ఈ నగర చరిత్రకు సారంగపాణి పదాలతో స్వస్తి పలుకుదాం –





**శంకరాభరణము – చాపు**

పల్లవి – మాటాడరా వేణుగోపాల యింత –
మౌనమేమిర వేణుగోపాలా – యిది

అనుపల్లవి – ఏటిమర్మము వేణుగోపాలా – యిక మా –
కెవరు దిక్కు వేణుగోపాలా ॥ ॥మా॥

మోము జూపర వేణుగోపాలా – నీసొ –
మ్మేమి బోదుర వేణుగోపాలా –

యేమి జెప్పవు వేణుగోపాలా – ముం
దేమి బుద్ధి వేణుగోపాలా ఒక్క ॥మా॥

రక్షించరా వేణుగోపాలా – నన్ను –
పేక్ష సేయకు వేణుగోపాలా

కక్షిగట్టకు వేణుగోపాలా సుంత –
కరుణ జూడర వేణుగోపాలా ఒక్క ॥మా॥

చేరదీయర వేణుగోపాల – నన్ను –
చెట్ట బట్టర వేణుగోపాలా

వేరుసేయకు వేణుగోపాలా – కా
ర్వేటినగర వేణుగోపాలా ఒక్క ॥మా॥



## భైరవి – ఝంపె

పల్లవి – జయ మంగళము – నిత్య – శుభమంగళం

ఇందిరారమణునకు – నిభరాజవరదునకు
మందరోద్ధారునకు । మాధవునకూ
నందనందనుడైన । నవనీతచోరునకు
కందర్ప శతకోటి । సుందరునకూ ॥జయ॥

అసుర సంహారునకు । నంభోజనాభునకు
అసహాయునకు చక్ర । హస్తునకునూ
వసుమతీ కాంతునకు । వనజాత నేత్రునకు
కుసుమాస్త్రుగన్న యదు । కుంజరున కూ ॥జయ॥

ఖగరాజగమనునకు । కనకమయచేలునకు
సుగుణాలవాలునకు । సుచరిత్రుకూ
అగణితవిలాసునకు । అఖిలదేవాత్మునకు
జగదేకవీరునకు । జయశాలికి ॥జయ॥

దీనమందారునకు । దివ్యమణిహారునకు
మానితాఖిల లోక । మాన్యునకునూ
గానలోలునకునా । గమ నిగమవేద్యునకు
దానవారికి తులసి । ధామునకునూ ॥జయ॥

ధరహాస వదనునకు । దారిద్ర్యశమనునకు
పురుహూత వంద్యునకు । పూజితునకు



కరుణా సముద్రుడై । కార్వేటినగరమున
పరగు శ్రీ వేణుగో । పాలునకునూ ॥ ॥జయ॥



కృష్ణం వందే జగద్గురుమ్.
ఓం శాంతి శాంతి శాంతిః

## నిశ్శంక దుర్గ శిలాశాసనము

(కార్వేటినగరము)

శ్రీరామ

1. యే సూర్యుడు తన సుఖమును హ్ర ----- సమస్తలోకాలను పోషిస్తుండు యెనాడు అంతా
2. మాత్రమే కాక సకల క్షత్రియ కులములకు ఆది కారణమైన వాడై రాజుల ---- రక్షస్తున్నాడు
3. యదిగ్కా సమస్త ప్రపంచములకు ఆది కారణమైన శ్రీమన్నారాయణు డున్న్ను యాదవ వంశమందు అవతరించి
4. నో అటువంటి సూర్యుడు సత్యపురుషుల ప్రత్యక్షదైవమైనవాడు ---- గ్ర కాశి సూర్యవంశమందు
5. యీ కలికాలమందు కలికాల చోళమహారాజు జన్మించెతణ్గి పంమ భాగవతుండైన చక్ర పతిన్ కుమారుడుదయించె
6. ఆచక్రపతి కుమారుడి మనముడై నారాయన రాజు జన్మించె ఈ నారాయణ రాజు వసుధావరాజు కు శ్రీ వెంకటేశ్వరా
7. ---- అధన్ రాజ్యం యిచ్చి క్షణికా చలమందు నరొని ---- అధన్ రాజ్యం నారాయణరాజు కు అనం
8. తర వంశ పర నద్రి చక్రరాజు పదోవాడున్న్ను ఆ నద్రిచక్ర రాజు కు రాజోత్తముడైన తిరుమల రాజు పదో వాడయ్యె
9. అత్యద్భుత పరాక్రమం గల్గిన ఆ తిరుమల రాజుకు నరసింహ రాజు పదోవాడైయ్యె ఆ నరసింహ రాజుకు సుఖసాగరువైన



10. కనకరాజు పదో వాడుంబయ్యో ఆకనక రాజుకు మద్రరాజు పదోవాడంబయ్యో ఆ మద్రరాజుకు రామరాజు పదో
11. వాడంబయ్యె ఆ రామరాజు నారాయణపుర ముందు శ్రీ కల్యాణ వెంకటేశ్వర స్వామి వారి విమానం గర్బ గృహ ప్రాకార గోపురం మొదలైన
12. ధర్మాములుచేశె ఆ రామరాజుకు సుదశ్యనరాయని యెనిమిదో వాడంబైయ్యె వదాన్యోత్తముడైనన ఆ సుదర్శన
13. రాజుకు వుద్దండ రాజు పదో వాడంబైయ్యె ఆ వుద్దడ రాజుకు మృంగాక రాజు పదో వాడంబైయ్యె ఆ మృగాంక రాజుకు
14. రాజస్వామి ---- రకై తన నామాంకితమైన దివ్యభవన శోభితమైన ---- చెశె ఆ మృగాంక రాజుకు పురర్ప
15. రాజు పదో వాడంబెయ్యె అతణ్కి వేలంకి రాజు పదో వాడంబైయ్యె ఆ వేలంకి రాజుకు అరుప్రభమూర్తి రాజు పదో వాడుం
16. బైయ్యె ఆ రాజు కుం అంబికియ రాజు పదో వాడంబైయ్యె ఆ అంబి కీయ రాజుకు రాజ రాజ నఅదండ మాక రాజు యెనిమిదవ
17. వాడంబైయ్యె ఆరుదండ మాకరాజుకు పరాక్రమ ఖండిత శతృ రాజులు గలిగిన శింగరి రాజు జన్మించె ఆ మహారాజు గృహమందు
18. రణంకణ ద్విగుణిత ప్రత్యర్థి పృద్వీపతి ప్రౌఢ ప్రౌఢిమదౌక తోద్యట భటాహంకారహుంకార శనుండైన మాకరాజు నుదయించె
19. ఆ మాకరాజు నిశ్శంక దుర్గ సమీపమందు సురపురి సత్కా రధికారి ---- నిశ్శింక పురి నిర్మాణంబుచేశే ఆ మాకరాజు

20. ముప్పై సంవత్సరములు రాజ్యభారంచేసి వైరాగ్యం పొంది తపము
జేశె నరకే శ్రీ వెంకటాచలాం జన్మిం

21. చెను ఆయనకు అల్లుడైన మాకరాజు మూడేండ్ల వాడైన మాకరాజు
కుమారుడు రామభద్రరాజుకు పట్టాభిషేకము జేసి ఆయనను సవ్వదా

22. పూజించు కుంటున్న సకల రాజ్య తంత్రముల భరించ్రే ఆ అల్లుడైన
మాకరాజులు ఈవృత్తాంతమును సమస్త జనులకు యెరుక

23. చేశె కొర్కై శిలాక్షరములు వ్రాయించె ఆశిలాక్షరములు యీలోకమందు
ఆ చంద్రార్కముగా సంతోషమును

24. జనులకు చేస్తును జయమును పొందగాతా॥

(ఇది సంస్కృత శిలా శాసనమునకు తెలుగుఅనువాదము.
సంస్కృత శాసనము తెలుగు లిపినందు శ్లోకరూపముననున్నది)





**నిశ్శంక దుర్గ శిలాశాసనము ననుసరించి**
**కార్వేటినగర రాజుల “వంశవృక్షము”**

-----

| | | |
|---|---|---|
| 1. | | సూర్యుడు ↓ |
| 2. | | కరికాల చోళమహారాజు ↓ |
| 3. | | చక్రపతిన కుమారుడు (తొండమాన్ చక్రవర్తి) ↓ |
| 5. చక్రపతిన మనుమడు | ----------- | నారాయణరాజు ↓ |
| 15. పదవరాజు | ----------- | నద్రిచక్రరాజు ↓ |
| 25. పదవరాజు | ----------- | తిరుమలరాజు ↓ |
| 35. పదవరాజు | ----------- | నరసింహరాజు ↓ |
| 45. పదవరాజు | ----------- | కనకరాజు |
| 55. పదవరాజు | ----------- | మద్ర రాజు |
| 65. పదవరాజు | ----------- | రామ రాజు |
| 73. ఎనిమిదవరాజు | ----------- | సుదశ్యన రాయని |
| 83. పదవరాజు | ----------- | వుద్దండ రాజు |
| 93. పదవరాజు | ----------- | మృగాంక రాజు |
| 103.పదవరాజు | ----------- | పురర్ప రాజు |
| 113.పదవరాజు | ----------- | వేలంకి రాజు |
| 123.పదవరాజు | ----------- | అరుప్రభ మూతిన రాజు |

133.పదవరాజు ---------- అంబికీయ రాజు

141.ఎనిమిదవరాజు ---------- రాజరాజ నరదండ మాకరాజు

142.మమారుడు ---------- శింగరి రాజు

143.కుమారుడు ---------- మాకరాజు

144.కుమారుడు ---------- రామ భద్రరాజు - శాసన అంతము - దుర్గశసనము తరువాత కార్వేటి నగరాన్ని పాలించిన రాజులు -- (వంశవృక్షము అనుసరించి)

144. రామ భద్రరాజు (దుర్గశసన అంతము)

145. కశవరాజు

146. రామరాజు

147. శ్రీరంగరాజు

148. గోవిందరాజు

149. బ్రహ్మరాజు

150. శింగరిరాజు

151. శ్రీ రంగరాజు

152. శింగరిరాజు

153. కావేరిరాజు

154. శింగరిరాజు

155. పెద్ద కావేరిరాజు (1659 - 1674) క్రీ.శ

156. కేశవరాజు

157. వెంకట పెరుమాళ్ రాజు



158. ఆది కావేరిరాజు (1732 - 1753) క్రీ.శ

159. వెట్టి బ్రహ్మరాజు (1753 - 1808)

160. వీరకావేరిరాజు

161. వెంకట పెరుమాళ్‌రాజు

162. బ్రహ్మరాజు (1840)

163. కుమార వెంకట పెరుమాళ్‌రాజు

164. తిరుమలరాజు

165. బ్రహ్మరాజు

166. తిరుమలరాజు

167. వెంకట పెరుమాళ్‌రాజు (1940 చనిపోయిన సం॥)

168. (తమ్ముడు) కుమారస్వామి రాజు - రాజరికము అంతము. (1952 చనిపోయిన సంవత్సరం)

(ఇతనికి పట్టాభిషేకము జరుగలేదు)



## నిశ్శంక దుర్గ శిలాశాసన వివరణ

నిశ్శంక దుర్గ శిలాశాసనము 14,15 శతాబ్దాల నాటిది. ఇది కార్వేటినగర రాజుల వంశ క్రమాన్ని తెలుపుతున్నది.

సంస్కృత శాసనం శ్లోక రూపంలో తెలుగు లిపిలో వున్నది. దానికి అనువాదమే తెలుగు శాసనం. శాసనం 14,15 శతాబ్దాల నాటిదైనా అది ప్రస్తావించిన కాలం క్రీస్తు పూర్వానికి చెంది 15 శతాబ్దం నాటికి చేరింది. శాసన ప్రారంభంలో 'శ్రీరామ' యనివున్నది.

భాషా పరిణామ క్రమంలో అప్పటికి తెలుగు, కన్నడ భాషలు పూర్తిగ విడిపోలేదు. కన్నడం నుండి కొన్ని అక్షరాలు యథాతథంగా తెలుగులో వున్నాయి.

ప్రస్తుతం మనం తెలుగులో ఉపయోగించే 'క' ఈ శాసనం నాటికి ఏర్పడలేదు. కన్నడ 'క' యథా లాపంగ తెలుగులో వున్నది.

'అర్ధ' అనే తెలుగు పదానికి అధన్ అనే కన్నడ పద ప్రమోగం వినియోగించారు. అట్లనే మరికొన్ని పదాలు వున్నవి.

శాసనాన్ని చెక్కిన వానికి చక్కటి అనుభవం వున్నట్లున్నది. శాసనంను చక్కటి అక్షరాలతో సుందరంగా చెక్కియున్నారు. అక్షరాలలో వంకరలు లేవు. రాతిబండ చదునుగ లేకపోయినా అక్షరాలు పొందికగా వున్నవి. చదువుటకు ఏమాత్రము ఇబ్బందిలేదు.

బండపై అక్షరాలను రంగుతో వ్రాసినవాడు, ఉలితో చెక్కిన వాడు ఒక్కడే కావచ్చు. బండపై రంగుతో అక్షరాలు వ్రాయకుండ శిల్పి అక్షరాలు చెక్కలేదు.



శిల్పి శిల్పంను చెక్కడానికి ముందుగ రంగు నీటితో రాతిపై కొలతల ప్రకారం చిత్రంను వేసి ఆ తరువాతనే శిల్పము చెక్కగలడు.

ఈ శాసనం నాటికే 'తెలుగు' ప్రజల భాషగా, దానితో పాటు ప్రభుత్వ భాషగా వుండి వుండవచ్చు

నగర రాజులు 'కరికాల చోళ' మహారాజు సంతతివారమని తెలుపు కొన్నారు. కరికాలునికి 4వ తరము వాడైన నారాయణరాజు కలలో శ్రీ వేంకటేశ్వరస్వామి వారు కనిపించి వసుదాన రాజుకు (ఆకాశరాజు) అర్ధ రాజ్యం ఇమ్మని ఆనతిస్తే ఆ ఆజ్ఞను శిరసావహించి నారాయణ రాజు తిరుత్తణి సుబ్రహ్మణేశ్వర స్వామి దేవాలయంలో దాన కార్యక్రమాన్ని ఏర్పాటు చేసి తన రాజధాని నారాయణపురం తోపాటు అర్ధ రాజ్యం ఇచ్చివేశారు.

నారాయణరాజు తదనంతరం 10 మంది రాజులకొకరి చొప్పున వంశక్రమాన్ని శాసనం వేసే కాలం వరకు పేర్కొన్నది. ఈ విధంగ వంశక్రమాన్ని పేర్కొన్న శాసనం ఇది ఒక్కటే కావచ్చు.

---

శిల్పము – కార్వేటినగర పంట పొలాల్లో లభించినది. (దాని చిత్రము ఇది) 45 సం।। ముందు గీచినచిత్రానికి నకలు. ప్రస్తుతము ఈ శిల్పంలేదు. దీనిని కూడ 4"–5" అంగుళాల మందము గల రాతిబండపై చెక్కయుండిరి.

ఇదిన్ని 'వీరుల సమరము' – శిల్పము నాటిది కావచ్చు. లేదా అంతకంటే ప్రాచీనము కావచ్చు

శిల్పం ముఖం స్పష్టంగా చెక్కియుండ లేదు దాన్ని బట్టి ఇది ప్రాదేన శిల్పమని తోచుచున్నది

**రచయిత**

